818

818/7.



# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య





The Registrar of Books,
Old College Buildings, Cathedral P.O.,
Nungambakkam, Madras



15-12-51] [Vol. 10 No. 9

ప్రకాశకులు
రామా అండ్ కో.
H.O. ఏలూరు

V.S. GURU

# విషయసూచిక



---

కావలెను :—శ్రీకాకుళంజిల్లా పార్వతీపురంలోనున్న (1) A E S సేతులవారివీధి స్కూలు నకు ఒకరు (2) A E S తెలుగు బ్రాహ్మణవీధి స్కూలులో రెండు (3) A E S జగన్నాథపురం స్కూలులో రెండును హయ్యరుగ్రేడు ట్రెయిండు టీచర్లు కావలెను ఒక్కొక్కనికి నెలకు గవర్నమెంటుస్కేలు +3 రూ మేనేజిమెంటు ఎలవెన్సు యివ్వబడును కావలసినవారు పైన వుదహరించిన బడిమేనేజర్లకు దరఖాస్తులు ది 22—12—51 తేదీలోగా పంపుచూ వాటి నకళ్లను పార్వతీపురం లేంజి స్కూళ్ళ యినస్పెక్టరువార్కి పత్రికవలెను

బెలగాం రామకృష్ణదాసు,
టీచరుమేనేజరు, సేతులవారివీధి,
పార్వతీపురం - శ్రీకాకుళంజిల్లా.

ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 40] ఏలూరు, 15 డిశంబరు [సంచిక 9




## వివరణము :

మన జీవితకేంద్రమును సమీపించుట కెపుడును ఆలస్యమనునది లేదు. కొంత కాలమునకు మనకు విసుగెత్తవచ్చును. నిరాశ జనింపవచ్చును. అపుడుగూడ మన మా కేంద్రమునే యాశ్రయింపవచ్చును. కాలమెప్పుడును అనుకూలించియే యుండును. అచటికిఁ జేరితిమా మనకిక నెట్టిభయమును లేదు. ఈ కేంద్రముతో సంబంధము లభించనిచో మన పనులన్నియు వ్యర్థమగును. లభించెనా సంశయములన్నియు విడిపోవును. మానవుని యశాంతతకు, అసౌఖ్యమునకుఁ, గారణమేమి? కేంద్రముతో నాతనికి సంబంధము లేకపోవుటే!

## సంకీర్తనము :

పరమేశ్వరా! ఈ మాయామోహమునుండి నా చిత్తమును ఉద్ధరింపుము.
నిన్ను వెదకెడి నా యత్నములను సఫలమొనర్పుము.
నీవే జ్ఞానజ్యోతివి విజ్ఞాననిలయమవు.
నా మార్గమును నీ దివ్యతేజస్సుతో వెలిగింపుము.

స్వామి రామతీర్థ.

# ఆంధ్రరాష్ట్రము

రచన:
'ఆనందబాల'



1. తీరదు రాష్ట్రవాంఛ, తమి తీరదు పెద్దల కీర్తివాంఛపై
మీరిన స్వార్థబుద్ధి యెడమీయదు తథ్యము రాష్ట్రసిద్ధికిన్
తీరనిలోటు నాయకుల తీయనిపల్కుల తీరు చూడగా
చేరిన తెలుగునిగ్గు కిసి తెర్చిన సాంబరు కప్పు గప్పెరా.
2. రాష్ట్ర మదేల మా కనును రాయలసీమను నొక్కి పెద్ద, యీ
రాష్ట్రము వద్దు మాకు మదరా సిటు రానిది నిద్రబోము, మా
రాష్ట్రము జన్మహక్కనును రాల్పడి సోలిన సింగమొండు; మా
రాష్ట్రము గోడు లేదు మదరా సరవయ్యల చైర్వ్య డయ్యెరా.

## ఇంద్రధనుసు

రచన. రుద్రాభట్ల-వేంకట భాస్కరరావు-చాపర.

మింట నుండెడి ధనుసు
కంటి కింపగు ధనుసు
అందమైనది ధనుసు
ఆ ఇంద్ర ధనుసు.
ఏడురంగుల ధనుసు
యెంతో చక్కని ధనుసు

వింత రంగుల గనుచు
సంతసించును మనసు.

మింటికిని మంటికిని
ఒంటి వారధి ధనుసు
అర్కుండు కిరణముల
నంబుదంబున జొనుప

ఆకారమును గొన్న ఆ చిన్నె యీధనుసు-ఆ ఇంద్రధనుసు.


పెద్దల విద్యావిషయిక ఏకైక మాసపత్రిక
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపక్షమున ప్రతినెల 25 వ తేదీన ప్రకటింపబడును.

**వయోజన విద్య**

ఎడిటర్ ఎన్ శ్రీ కంఠమ్.

మదరాసు ప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరుగారిచే అప్రూవ్ కాబడినది
Proceedings Roc. No 50-N/51 dated 27-1-51
సంవత్సర చందా మూడు రూపాయలు మాత్రమే.

వ్యాసములు పంపుటకు —
ఎడిటర్ - వయోజనవిద్య
ఆళ్ళగడ్డ, కర్నూలుజిల్లా.

చందాలు పంపుటకు.
మేనేజర్ - వయోజనవిద్య
కోయిలకుంట్ల - కర్నూలుజిల్లా.

# "బేసిక్ విద్య భారతదేశానికి వరప్రసాదం"

మూలం శరభేశ్వర్ నాయక్, B A. :: అనువాదం శీలా వెంకటప్ప.

భారతదేశము నందుండు గ్రామాలు ప్రాచీన నాగరికతతో, హైందవ సంస్కృతీ విజ్ఞానాలతో విలసిల్లుతూ వుండినవి. ఆ గ్రామసీమల ప్రజలకు అనుగుణ్యమైన విద్యావిధాన మున్నప్పుడే ఆ గ్రామీణులనుండి సముచితమైన ఆదరణ, పోషణ లభిస్తాయి. అప్పుడే ఆ విద్యావిధానం సాఫల్యం పొందుతుంది. అందుకు కారణం ఈ విద్యాప్రణాళికలో భారతప్రజల సంస్కృతీ నాగరికతలు, వృత్తులు, నిబిడీకృతమై వుండడమే. భారతదేశంలో యే విద్యావిధానమును ప్రవేశపెట్టినా గూడ మన పల్లెసీమల వృత్తుల ననుసరించి, ప్రోత్సహించునదిగ వుండవలెను. అటువంటిదే సంపూర్ణ విద్యావిధానము.

మన విద్యావిధానం కేవలం అక్షరాస్యతను కలిగించడమే కాదుగాని, మన వృత్తులను ద్విగుణీకృతం చేయదగినదిగా వుండవలెను. కలుముపట్టినా, పట్టకుండినా కొన్ని సందర్భాల్లో స్వీయ వుదరపోషణ, వృత్తి మీాద ఆధారపడి వుంటుంది. కాన ఈ విషయాన్నిగూడ దృష్టియందుంచుకొని మన వృత్తి విద్యను నిర్ణయించవలెను. కేవలం ఠాగూరు, కాళిదాసులవంటి మహా పండితోత్తముల సృష్టించవలెననెడి వుద్దేశం లేకపోయినను, మన అనుదినచర్యలలో (వడ్రంగము, నేత, వ్యవసాయము) సౌలభ్యంగా సంవత్సరమంతా తమ వుదరపోషణ సంతృప్తిగా జరుపుకొనునదిగా యుండవలెను. మఱియు నవ్యప్రపంచముతోపాటు సమాన గౌరవ హోదాలతో పురోగమించునదిగా యుండవలెను.

పాశ్చాత్య దాస్య శృంఖలాలనుండి విడివడి మనం స్వతంత్రులైనాము. మన జాతిపిత పూజ్య బాపూజీచే కనుగొనబడిన బేసిక్ విద్యావిధానమును ధైర్య సాహసాలతో, సముచితోత్సాహముతో మన మంతా నెరవేర్చేటందుకు సంసిద్ధులమైయుండవలెను. మన స్వారాజ్యప్రదాత కలలుగన్న ఈ విధానాన్ని భారతదేశమంతటా ప్రస్తుతం అమలుజరిపితే సాంఘికముగ, ఆర్థికముగ, రాజకీయంగా పునరుద్ధరించబడుతారని మిక్కిలి ఆశించియుండినారు. "హరిజన్" పత్రికలో మహాత్మాజీ "విద్య" విషయమై ఇలా వ్రాసినారు. "విద్య అనునది బాలునిజీవితంలో నేర్పడం ఆత్మ, దేహ సంబంధముగాసామాన్యమైనదికాదు. విద్య అనునది ఆది అంత్యములు లేనిది. స్త్రీ పురుషులనువిద్యావంతులుగాచేయుటకుమూలాధారము వృత్తివిద్యయే. (బేసిక్‌విద్య) అక్షరాస్యత విద్యకాదు. కావున ప్రారంభవిద్యను వృత్తివిద్యతో ప్రారంభించవలెను." కావున గాంధేయ బాలుడు (వృత్తి విద్యా బాలుడు)గా వున్ననాడు వృత్తి విద్యనుయాంత్రికముగా కాకుండినను, శాస్త్రసంబంధంగానైనను నేర్చుకొనేందుకు ఇందులో చక్కని అవకాశాలు యిమిడివున్నాయి.

అందుచేత బేసిక్ విద్యాప్రణాళికలో బాలుడు తల్లిదండ్రులపై ఆధారపడి వుండేందుకు వీలులేదు. ఈ విధానములో బాలుడు స్వయముగా, వృత్తితో చేయబడిన వస్తువులను విక్రయించి ధనార్జన చేయగలడు. మరియు బాలుడుచేసిన వస్తువులను తల్లితండ్రులు మరింత బాగుగా చేయుటకు తోడ్పడినచో, ధనార్జనయొక్క వయ్యేందుకు అవకాశంవుంది. బేసిక్ విద్యతోపాటు సాంఘిక, ఆర్థికవిషయాలు నేర్చుకోవటంవలన స్వేచ్ఛాజీవనం చేయగలడు. ఎప్పుడైతే తనకాళ్ళపైనిలబడి స్వతంత్రంగా జీవిస్తాడో ఈజీవనమే సర్వోత్కృష్టమైనది.

భారత దేశములో అధికసంఖ్యాకులు ఆర్థిక దుస్థితిలో వున్నందున తమపిల్లల వయస్సు, భావినిగురించి ఆలోచించకనే, తమకుక్షింభరత్వానికై యెట్టి అకృత్యాలకైనా పాల్పడి తమ బాలబాలికలను వక్రమార్గానపోనిస్తున్నారు. దీనినిబట్టి వీరు విద్యయొక్క విలువ గ్రహించలేదనిగాని, బిడ్డలపై వాత్సల్యంలేదనిగాని, విద్యనుచెప్పించకూడదనిగాని, వారిభవిష్యత్తును నాశనము చేయవలెననిగాని, వారివుద్దేశంకాదు. దీనికంతకు వారి ఆర్థికదుస్థితియేగాని మరేమి కాదు. మనదేశంలో ఒక కుటుంబము సరాసరి ఆదాయం తమ బిడ్డలవిద్యకే సరిపోతున్నది. మిగతా కుటుంబము ఖర్చులు భరించలేక అనేక యిడుములకు లోనౌతున్నారు. ఈకష్టపరంపరను నిర్మూలించేందుకు సరియైన దివ్యౌషధం, పూజ్యబాపూజీ ప్రసాదించిన బేసిక్ విద్యావిధానమే.

కావునమనప్రభుత్వం మితవ్యయముతో కూడుకొన్నదిగా నేర్పువిద్య సంఘపురోభివృద్ధికినీ, జీవితపర్యంతం స్వీయ జీవనోపాధిని, కలిగించేదిగాను, వుండవలెను. నేటి పాశ్చాత్య విద్యా విధానం ఆఫీసులలో గుమాస్తాలను మున్నగువారిని తయారుచేయగలిగిందేగాని, ఒక్కవిద్యావంతుడైన కర్షకుని ఆవిర్భవింప చేయలేక పోయింది. నేటి భారతయువకుడు పాశ్చాత్యయువకుని మాదిరి ఆఫీసులలోను, కర్మాగారములలోను (Work shops) పనిచేయుచు,పట్టణనివాస వ్యామోహమునకు లోనై, తన స్వంతభూములను, విద్యావిహీనులైన తనతోటి భారతకర్షకులకు అప్పగించి, వారు రెక్కలెండబెట్టుకొని ఆర్జించిన సొమ్ముతో నైచ్యజీవితానికి పాల్పడుచున్నాడు!

అట్లుగాకుండా మనప్రభుత్వం ఈ బేసిక్ విద్యావిధానమును మనస్ఫూర్తిగా, సంపూర్ణముగా అమలుజరిపినచో, భారతదేశములో విద్యా సమస్యను పరిష్కరించవచ్చును. నేడిదే ముఖ్యసమస్యగానున్నది. ఈ విద్యాభ్యాసకుడైన బాలుడు కుటుంబమునకు వ్యర్థుడుకాడు. ఎందుకనగా ఈవిద్య నవ్యాదర్శముతో కూడుకొన్నది గానవానికి విద్యను ప్రసాదించడమేకాక, కుటుంబాదాయమునుగూడ ప్రసాదిస్తున్నది. దీనివలన ప్రభుత్వముమీద ఆధారపడకుండా వుండుటకును, సాటిదేశాల్లో కీర్తిప్రతిష్ఠలు ఆర్జించేదిగాను, వున్నది. పూజ్యబాపూజీ ప్రసాదించిన నవ్యాదర్శముతో కూడుకొన్న ఈ విద్యాప్రణాళికను మన జాతీయ ప్రభుత్వం స్వచ్ఛందముగా, సక్రమముగా, అమలు జరుపవలెను. ద్విగుణీకృతోత్సాహంతో దీన్ని జయప్రదం చేయవలసిన బాధ్యత మనపై యున్నది. ఇది సాఫల్యం పొందిన నాడు మన భవిష్యత్తు మహోజ్వలంగా, ఆదర్శనీయంగా వుంటుంది.




నేనూ, మిత్రుడు రామకృష్ణశర్మ, కలిసి వ్రాసిన 'ఉషోదయాన్ని' ఈ పత్రిక గత మాసపు సంచికలో చూచిన నామిత్రు డొకడు నావద్దకొచ్చి ఏరా 'చిరంజీవి', నవీన విద్యనుగూర్చి నాటకాలూ, కథలూ, అల్లి నాజూకుగా మాముందు పెడుతున్నావ్ కాని తమ్ముడూ! ఇది మన కెప్పటికైనా ఉపకరించడ్డానికి సాధ్య మయ్యేదేనా? అనే సందేహం యిప్పటికీ నన్ను బాధిస్తుందిరా? ఇదంతా నీతో చెబితే 'మీరంతా పైపై చూపుగాళ్ళే కాని లోపలి చూపుగాళ్ళు కారంటావ్ నీ'జీవితవిద్య'లో అన్నట్లు, అయినా యీ వేళ ధైర్యంగా నిన్నడుగుతున్నాను. నా సందేహం కాస్త తీరుద్దూ ...కళ్ళల్లో కొంచెం పిరికితనం తొరట్లాడుతూన్నట్లు నటిస్తూ, కొంటెగా (నా ఊహాలో) అడిగేడు.

నాలోకొంచెం కంగారుపుట్టిన మాట వాస్తవం. ఎంచేతనంటే నాతోటరచయితలు కొందరిలాగా హృదయంలోని భావాలు కలంద్వారా ప్రసరింపజేయుటం వరకే నా బాధ్యతగా తలంచిన వాడినేగాని, నా రచనలు చదివినవారికి కలిగించే సందేహాలను తీర్చవలసిన బాధ్యత నాపైఉందని కలలోనైనా ఊహించిన వాణ్ణికాను. ఇప్పుడట్టిది ఆకస్మికంగా తటస్థించింది. మరి కంగారు పుట్టదూ? తప్పని సరి కాబట్టి ధైర్యం తెచ్చుకొని 'ఏం అన్నయ్యా! ఏంటి నీ సంశయం?' అన్నాను నసుగుతూ,

'చూడు, నువ్వంటావు విద్యార్థి నవీన విద్యమూలంగా జీవితాని కుపకరించే విద్య నేర్చుకుంటాడని-అందు మూలంగా స్వావలంబకుడూ, స్వయంపోషకుడుకూడా ఔతాడని ప్రస్తుతం పాఠశాలల్లో నేర్పుతున్నది రాట్నంమీద నూలు తీయడం, నువ్వన్న జీవితాని కుపకరించే విద్య ఈ రాట్నం మీద నూలు తీయడమేనా తమ్ముడూ—

నవీనవిద్యను గూర్చిన తక్కినసందేహాల లాగా ఆధారరహితమైందిగా త్రోసి వెయ్యటానికి వీల్లేని సందేహమిది. ప్రస్తుత పాఠశాలలలో ప్రభుత్వంచేత నడుపబడేవే కానియ్యండి, పై వారిచే నడుపబడేవే కానియ్యండి, ముఖ్య పరిశ్రమగానూ, వృత్తి విద్యగానూ, నేర్పబడేది, నూలు తీయటంచాలకొద్దిగా తోటపనీ మాత్రమే. తోటపనైనా 'తొలినాజేసిన పూజాఫలము' మూలంగా పాఠశాల తన్ననుసరించి ఖాళీ స్థలం కలిగిఉంటే గింటేనే ఆచరణలో ఉంచబడేది. సాధారణంగా పాఠశాలలకి సరియైన గృహాలే కరవు. అటువంటి పరిస్థితు లలో తోటలకీ, ఆటలకీ, స్థలాలెక్కణ్ణించొస్తాయి. ప్రస్తుత పరిస్థితు లిలాఉన్నై.

నవీన విద్యావిధాన మాశించే ప్రయోజనం మహోత్కృష్టమైంది. విద్యార్థి అతని

భావిజీవితాని కుపకరించే ఒక ప్రాంతీయ పరిశ్రమలో నైపుణ్యాన్ని పొందడం తద్ద్వారా విద్యాసముపార్జనయొక్క పూర్తి ప్రయోజనాన్ని సాధించడం ఇందుకుగాను విద్యార్థుల మానసిక పరిస్థితుల ననుసరించి పాఠశాలల్లో ప్రవేశపెట్టడాని కుపకరించే పరిశ్రమలుగా అనుభవం మూలంగా గ్రహింపబడినది (1) వ్యవసాయం – తోటపని (2) వడుకుట – నేయుట (3) వడ్రంగము – లోహపుపని (4) చర్మపుపని (5) మట్టిపని.

నవీన విద్యాలయాల్లో గైకొనబడిన పరిశ్రమలకును, ఎరవాడ మున్నగు ప్రాంతములలోగల శిక్షణాలయాలలో గైకొనబడిన పరిశ్రమలకును, ఉద్దేశములయందు వ్యత్యాసముంది. ఈ రెండోరకపు పాఠశాలలు పిన్న వయస్సులలో చెడుమార్గాలకు లోనై, సక్రమ సంస్కారంకోసం శిక్షితులుగా పంపబడే నేరస్థులకోసం ఏర్పరుపబడ్డవి. వారికి సక్రమ వర్తన నలవరచి, భావిజీవితాధారభూతములుగా కొన్నివృత్తులలో నైపుణ్యాన్ని కలిగించి, స్వతంత్రపథవిహారులుగా వారిని ప్రపంచంలో విడవటం వీటిపని. ఇందుకోసం ఈ పాఠశాలలలో దాదాపు 12 వృత్తులలో శిక్షణనిస్తున్నట్టు తెలియ వస్తున్నది. ఇందులో పైచెప్పిన నాలుగు తెగల వృత్తులేకాక దర్జీపని, ఊలుగుడ్డలు నేయడం కుట్టడం, చాకలిపని. చిత్రలేఖనం, క్షురకర్మ యితర చేతిపనులుకూడ చేర్పబడ్డాయి. ఈ పాఠశాలలలో యీ పరిశ్రమలు విద్యలో ఒకభాగంగా మాత్రం నేర్పబడుతున్నాయి. కాని నవీన విద్యాలయాల్లో పరిశ్రమల స్థానం పూర్తిగా దీనికిభిన్నం. ఈ పాఠశాలలలో గైకొనబడిన పరిశ్రమ తృప్తిపరువలసిన విషయాలు చాలా ఉన్నై.

1. ఈ పరిశ్రమ విద్యావిషయికమైన అన్ని అంశములను వీలైనంతవరకు సమన్వయించి బోధించడానికి తగు అనుకూలతను కలిగి ఉండాలి.

2. విద్యార్థుల శారీరక, మానసిక శక్తుల అభివృద్ధి కవకాశమునిచ్చునదై ఉండాలి.

3. పరిశ్రమ నిర్వహణ కుపయోగపడే పనిముట్లు సాధ్యమైనంతవరకు యంత్ర సహాయము లేకుండ తేలికగా తయారు చేయుటకు అనుకూలమైనవిగా ఉండాలి.

4. పెట్టుబడి తక్కువ ఆదాయము ఎక్కువగా ఉండాలి.

5. పరిశ్రమ కవుసరమగు ముడి పదార్థములా పాఠశాలలలోగాని, పరిసరములలోగాని, లభించునట్టివిగా ఉండాలి.

నేరస్థులశిక్షణాలయాల్లోలాగా వృత్తులు వేరు. విజ్ఞానం వేరుగాకాక, ఈ నవీనవిద్యాలయాల్లో వృత్తుల నిర్వహణద్వారా విజ్ఞానం నేర్పబడుతుంది. అందుచేత ఈ పాఠశాలల్లో వృత్తి విషయాలూ, విజ్ఞాన విషయాలూ, పెనవేసుకొని సాగింపబడుతుంటాయి.

మరోవిషయం నవీనవిద్యలో స్వయం పోషణాభిప్రాయము చాలలోతైనది. ఇందు మూలంగా సంపాదించే స్వావలంబనా సామర్థ్యం ఆర్థిక సంబంధమైనది మాత్రమే కాదు. సాంఘికముగాను, నైతికముగాను, కూడా స్వావలంబనము నొందగలగాలి విద్యార్థి తన భావి జీవితంలో—

ఇంతటి మహోత్కృష్టాదర్శాల ముందు పెట్టుకొని నవీన విద్యా పాఠశాలలు నడుపబడపూనుకున్నాయి. కాని ఫలాభావం మనం

చూచేంగదా విధానానికి వెన్నెముకవంటి వృత్తి నిర్వహణకు కావలసిన అవసరాలు చాలా ఉండాలని, అటువంటి అవకాశాలు మన పారశాలల్లో ప్రస్తుతం చాలతక్కువగా ఉన్నై, అందువలన చాల నవీన విద్యాలయాలు పేరు తెలియజేసే బోర్డు మార్పువలన మాత్రమే నవీన విద్యాలయాలుగా తెలుపబడుతున్నాయేగాని, బోధనా విధానంలోగాని, నిర్వహణా విధానంలోగాని, నవీన విద్యాలయాలు కాలేక పోతున్నాయి. ఇందుకు కారణాలు చాల ఉన్నాయి. అవకాశముంటే ఆ విషయాలన్నీ వేరే వ్యాసంలో చర్చించుకుందాం.

ఈ కారణాలవల్ల ఇప్పుడిప్పుడే నడయాడటం నేరుస్తున్న చిన్నపిల్లవాళ్ళలాగా పడుతూ, లేస్తూ, కుంటుకుంటూ తమకున్న స్వల్పావకాశాలలో నిర్వహించడానికి అవకాశమున్న పరిశ్రమనేదో ఒకదానిని ఆధారంచేసుకొని, నడక సాగిస్తున్నాయి మన పారశాలలు ప్రస్తుతం. ఇందుకు అందుబాటుగా ఉన్న పరిశ్రమగా నూలు వడుకుటం ఒక్కటే కనిపించింది వాటికి.

నూలు వడుకటం తేలిగ్గా కొట్టివెయ్యవలసిన పరిశ్రమకాదు. 1. మహాత్ముడు నూలువడుకుతోనే, మనల్ని రెండువందలేండ్లు నిరాఘాటంగా పాలించిన బ్రిటిషు సింహాన్ని గజగజ వడికించాడు. ఇది అందరికీ తెలిసిన విషయమే. 2. విద్యార్థులకు ఒక వృత్తి విద్యలో నైపుణ్యము కలుగుతుంది ఈ పరిశ్రమద్వారా 3. నవీనవిద్యావిధానంలో పరిశ్రమ తృప్తిపరచవలసిన విషయాలన్నింటినీ యిది తృప్తి పరుస్తుంది. 4. ఖర్చుతక్కువ, ఆదాయం ఎక్కువ. 5. నేడు దేశాన్ని ఎదుర్కొంటున్న వస్త్ర సమస్యను తీర్చడంలోకొంతఉడతాసాయం చేస్తుంది. ఈ విధంగా భుక్తికీ, ముక్తికీ, కూడా పనికివస్తుంది.

ఉన్నకొద్ది అవకాశాల్ని సద్వినియోగం చెయ్యడానికి మాత్రమే మనపారశాలలీ ఒక్కవృత్తి విద్యమీాదనే తమ దృష్టి ప్రస్తుతానికి కేంద్రీకరింపవలసివచ్చింది. అంతే కాని అదొక్కటి మాత్రమే నవీన విద్యాపారశాలలు నేర్పవలసిన పరిశ్రమకాదు.

మిత్రుడడిగిన చిన్న ప్రశ్నకి యింత పెద్ద స్వగతం నా మనస్సులో వల్లించుకోవలసివచ్చింది. స్వగతం ప్రకాశంఅయింది. ఇదంతా ఉపన్యాసంలాగావిన్న నామిత్రుడు 'ఓహో ! అని మాత్రం అని శలవు తీసుకున్నాడు యింటికి–మనస్సంగీకరిస్తే మననం చేసి మంచిచెడల్ని విచారిస్తాడు. మనస్సంగీకరించక పోతే మరిచిపోతాడు. అయినా చదువును గూర్చిన విషయాలాలోచించడానికి సావకాశాలేవీ మనదేశీయులకు.

నేను ఆలోచిస్తూ కూర్చున్నాను. ఈ పూటతో బియ్యంఅయిపోతాయని యింట్లో వాళ్ళు చేప్పేరుకదా ? యిందు విషయం పంచేదామాఅని...



## అ - ఆ - ల జీవితం :

'చిరంజీవి'

'అమ్మా! ఆకలే!
ఇంకా బువ్వపెట్టవేమమ్మా?
ఈ వేళైంది చూసేవా?'.. ...
ఉండరా నాయనా ఒక్కగడియ
ఊరిలోనుండి నాన్నగా రొస్తారు.
'బు' అక్షరం ఒచ్చిందా నీకు
'బూ' రాస్తాను. దిద్దుదూగాని......
ఎప్పుడైనా వేళ కన్నంపెట్టి

పడిశానా పషాచిన్ని నాయనకి
ఐనవారైనా కానివారైనా
ఒక్కపావుశేరు గింజలకోసం
ఓపిక లేక పోయినా ఊరంతా తిరిగేను.
ఔనులే ఎందుకిస్తారు అప్పు
అందరికీ తెలుసు అయ్యావారు తీర్చలేడని
ఆః కళ్లు తోడేస్తున్నాయి
ఈ 'అ – ఆ' లజీవితంలో.

బాలగీతాలు :

## రా మ చి లు క

రామచిలుక–రామచిలుక–రమ్యమైన రామచిలుక
'రామ' 'రామ' 'రామ' అనుచు ప్రేమగూర్చు రామచిలుక.

2. చిట్టిపొట్టి రెక్కలూపి–చెట్టుచెట్టు గెంతుకుంటు
ముదము గూర్చు రామచిలుక–ముచ్చటైన రామచిలుక॥ రా॥

3. ఆకుపచ్చరంగుతోడ–ఆకులలో ఆకు అగుచు
అగుపడి అగుపడక ఎంతో–అందమిచ్చు రామచిలుక॥ రా॥

4. ముచ్చటనుచు పట్టి కట్టి–తెచ్చి పంజరాన బెట్ట
ఎగుర స్వేచ్ఛలేక చాల–దిగులు నొందు రామచిలుక॥ రా॥

5. పట్టి తెచ్చువారు తెచ్చి–పెట్టు పండ్లకొరికి తినుచు
ముద్దుమాట లాడుచెంతో–ముచ్చటిచ్చు రామచిలుక॥ రా॥

6. పంజరంపుతలుపు కొంత–బయలునిచ్చు సందుచూచి
తుర్రు మనుచు ఎగిరి చెట్టు–తొర్రదూరు రామచిలుక॥ రా॥

(చిరంజీవి)

## కథా గేయము

(చీమ, పావురము, కోయవాడు)

సం॥ రాజు శ్రీ వేణుగోపాలరావు పంతులు మునుగోడు.

1. ప్రొద్దుపైకి చీమ ఒకటి ప్రాకుచుండెను
కాలుజారి చెఱువులోన గంతువేసెను.

2. అంతలోన పావురంబు ఆకు విసరెను
ఆకుపైకి వచ్చి చీమ హాయి నుండెను.

3. కోయవాడు పావురాన్ని కొట్టబోయెను
చీమ కాలుకుట్టినపుడు చెదరెగురియును.

4. బాలులార చూడుడయ్య పావురంబును
పరుల మేలుగోరి తాను బ్రతికియుండెను.




తర్జుమాదారు కొండ్రెడ్డి సూర్యప్రకాశం

(గతనెల తరువాయి)

ప్రావిడెంటుఫండు చెల్లించువ్యక్తులు యీదిగువ వ్రాయబడిన నియమములు పాటించితీరవలెను

1. అట్టివ్యక్తులు వారు పనిచేయు పాఠశాలలో రోజంతయుపనిచేయు ఉద్యోగస్థులుగా యుండవలెను. కానియీసూత్రము 2-3 పాఠశాలలలో దినమందలి కొన్ని గంటలుమాత్రమే ప్రతిపాఠశాలలోను పనిచేయు ఉపాధ్యాయులకు వర్తించదు.

2. 18 సం॥రములులోపు వయస్సుగలిగినట్టిగాని, 60 సం॥రములవయస్సుదాటినట్టిగాని, ఉపాధ్యాయునకు ఫండుచెల్లించుటకు హక్కులేదు.

3. స్థానిక, లేకప్రభుత్వపు పాఠశాలలో పనిచేసి, 55 సం॥రములు నిండినపిదప, రిటైరుకాబడిన ఉపాధ్యాయుడు తిరిగి ద్రవ్యసహాయపు పాఠశాలలో పనిచేయుటకు ఉపాధ్యాయుడుగా చేరినపుడు అట్టిటీచరు ప్రావిడెంటుఫండు చెల్లించుటకు అర్హతలేదు.

షరా — ప్రావిడెంటుఫండుచెల్లించు చందాదారులు ఒకస్కూలునుండి మరియొకస్కూలునకు మారినపుడు తరువాతస్కూలులో ఆక్టింగులేక టెంపరరీలేక ప్రొబేషనుమీద పనిచేసినప్పటికిని ప్రావిడెంటుఫండు అట్లుమారిన స్కూలులో ఆఖరిస్కూలులో గూడ ఫండుచెల్లించుచునే యుండవలెను.

(బి) ఈదిగువతరగతుల ఉద్యోగస్థులు దానిక సంబంధమగు ఉపాధ్యాయుని దరఖాస్తు పైని ఈస్కీములో చేరకుండా విడిచిపెట్టబడవచ్చును.

(I) సర్టిఫికెట్లుగల ఉపాధ్యాయులు, పండితులు, ఉరుదుపండితులు, ఇన్స్ట్రక్టర్లు, (బోధకులు) లైబ్రేరియన్సు, (అనగా పుస్తకభాండాగారములు నడుపువారు) మరిన్ని గుమాస్తాలు, వీరిలోఏదైన ఒకజీవిత భీమాకంపెనీలోజేరి, పాలసీని కలిగియుండి, ఆ పాలసీ అమలులో నడపబడుచున్నంతకాలము అట్టివారును—

(II) సర్టిఫికెట్లు గలటీచర్లును, పైనవ్రాయబడినట్టి ఒకస్కూలులో పనిచేయుచున్న యితరఉద్యోగస్థులును, అట్టివిద్యాలయము పబ్లికు ఇన్స్ట్రక్షను డైరెక్టరువారివల్ల ఆమోదింపబడిన స్వంతప్రావిడెంటు ఫండును కలిగియున్న స్కూళ్ళలోపనిచేయు ఇతరఉద్యోగులు, అట్టిదానికి ప్రయివేటుఫండును చెల్లించువారును—

(iii) సభ్యులమీద పేదరికమును గూర్చిన ప్రమాణములు చేసినట్టి మతసంబంధ మగు ఆజ్ఞకుచెందిన ఉపాధ్యాయుడును–

(సి) జిల్లావిద్యాశాఖాధికారులుకు (బాలికాపాఠశాలల విషయములో బాలికాపాఠశాలల పరీక్షాధికారిణియును) స్కూళ్ళను, ఉద్యోగీయులను, చేర్పించుటకు తగియున్నారు. ఒకస్కూలుయొక్క మేనేజరు లేక కరస్పాండెంటుద్వారా నియమింపబడిన అపిండెక్సు A నమూనాలో దరఖాస్తు దాఖలుచేసుకొనుటకు ఫండులోచేరుట తప్పని సరిఅయిన అందరి ఉద్యోగస్థులను చేరుడని ప్రోత్సహించి చేర్పించవలెను. ఫండుచెల్లించుటకు అర్హతగల ప్రతి ఉద్యోగస్థునకు స్పష్టముగా సంతకము చేయబడిన రెండు ధృవపత్రికలను (సర్టిఫికెట్లను) వారు శాంక్షను చేయవలెను. అందొకటి ఉపాధ్యాయుడు లేక ఉపాధ్యాయిని ఫండును చెల్లించుటకు అర్హతగలదని వ్రాసిన సర్టిఫికెట్టు మరియొకటి యీదిగువ తెలుపబడిన ప్రకారం వ్రాయబడిన సర్టిఫికెట్టు.

చందాదారు బడిపూర్తిగా మానినపిదప (అనగా రిటైరుఅయినపిదప) లేక తగిన కారణమువల్ల ఫండును పూర్తిగాతీసుకున్నపుడు, యిందులోని సూత్రముల ప్రకారము కండిషనులు సరిపోయినపుడు, అతనియొక్క లేక ఆమెయొక్క ఫండు సొమ్ముఆనాటికి ఎంత నిలవయుండునో అందు మూడవవంతు సొమ్ము ప్రభుత్వపుసొమ్ములో నుండి తీసి యీ ఫండుకు కలిపియిచ్చెదరు.

6 వ సూత్రము ఇన్‌ప్రాలో చెప్పబడిన ప్రకారము చందాదారులకు బట్వాడా చేయవలసిన సేవింగ్సుబ్యాంకు ప్యాసుబుక్కులకు అట్టిసర్టిఫికెట్లు జతపరచవలెను. సర్టిఫికేటు ఏనెలలో మంజూరుచేసిరో ఆనెల ప్రారంభమునుంచిన్ని మేనేజిమెంటున్ను, ఉద్యోగస్థుడున్నుగూడ, ప్రావిడెంటుఫండు చందానుచెల్లించి తీరవలెను. జిల్లావిద్యాశాఖాధికారులును, గరల్సుస్కూళ్ళ ఇన్‌స్పెక్ట్రెస్‌లును, అపిండెక్సు B లో చెప్పబడిన ప్రకారము కార్డుకేటలాగు అను రిజస్టరులను ఉంచవలెను. అందుఫండులో చేరుటకు అనుమతింపబడిన చందాదారులపేర్లును, అధికార్లవలన ఎవరికి సర్టిఫికెట్లు వారివలన యీయబడినదో వారిపేర్లును, నమూదుచేయబడవలెను.

(మిగతా వచ్చే నెల సంచికలో)



# *అమెరికాలో ప్రాథమిక విద్యావిధానము*

శీలా వెంకటప్ప, టీచర్; బోర్డు సెంట్రల్ స్కూలు - కమలాపురం (కడపజిల్లా)

ప్రాచీన భారతఖండములో మాదిరిగానే, అమెరికాలో నిన్న మొన్నటివరకు వున్నటి రోడ్లు, రవాణా సౌకర్యాలు ప్రారంభము కాకమునుపు ఆ దేశంలోకూడ పర్ణకుటీరాలల్లో ఒకే వుపాధ్యాయుడు అనేకమంది బాలబాలికలకు విద్యను ప్రసాదించేవాడు. ఐదు తరగతులకు ఒక్కడే బోధించేటందువల్ల సక్రమమైన శిక్షణగాని, బోధనగాని, లభించకపోవడం జరుగుతూవుండేది.

నేటి అమెరికా రాజ్యాంగవిధానములో జాతి, మత, వర్ణ విచక్షణ లేకుండా అన్ని ప్రభుత్వ పాఠశాలల్లో వుచిత విద్యాభ్యాసం కల్పించడం, బాల బాలికలకు ప్రత్యేక సౌకర్యాలు కల్గించియుండడం గమనార్హం. నిర్దుష్టమైన ప్రణాళికలతో ప్రత్యేకమైన కమిటీలతో సక్రమమైన ప్రాథమిక విద్యా విధానాన్ని అమెరికన్ ప్రభుత్వం అమలు పరుస్తూ ప్రజాబిడ్డల శ్రేయస్సుకై ఇతోధికంగా పాటుపడుతూ అభ్యుదయ పథాన పురోగమిస్తున్నది. అనేక లక్షల ప్రాథమిక పాఠశాలల నెలకొల్పి ప్రాథమిక దశలోనే వివిధవృత్తివిద్యలకుఅంకురార్పణచేస్తున్నది. అద్యతన భావిలో నేటి బాల బాలికలు రేపటిపౌరులన్న సత్యాన్ని గుర్తించి, వారి బిడ్డల విద్యకై యెంతైనా వ్యయంచేసి వారి అభ్యున్నతికై నిరంతరం కృషిచేస్తున్నది.

సాధారణముగా గ్రామమున కొకటి గాని, అంతకెక్కువగాని, ప్రాథమిక పాఠశాలలుంటాయి. పెద్దపెద్ద పట్టణాలల్లో సమగ్రమైన పరికరాలతో, సర్వసౌకర్యాలతో విలసిల్లుతూ, శోభాయమానంగా కేంద్ర పాఠశాలలు (సెంట్రల్ స్కూల్సు) వుంటాయి. ఈ పాఠశాలల్లోకి 20 లేక 30 మైళ్ళ నుండి కూడ బాలబాలికలు విద్య నేర్చుకొనేందుకు వస్తారు. ప్రభుత్వం బిడ్డల సౌకర్యార్థమై బస్సులనడిపి, పాఠశాలలందు చేర్చి, అమెరికన్ బాలబాలికలందు అమిత శ్రద్ధాసక్తులఁజూపుతూ వీరిని అభ్యుదయ పథాన పురోగమింపఁజేస్తున్నది. ప్రాథమిక పాఠశాలలోని బాలబాలికల ఆరోగ్యవిషయములో యెక్కువ శ్రద్ధాసమన్వితులై వుండేందుకు, ప్రభుత్వం తగిన చక్కని సూచనలిచ్చి డాక్టర్లను ప్రోత్సహిస్తున్నది.

అమెరికా ప్రభుత్వం ప్రారంభవిద్యా కేంద్రాలల్లో సుబోధకమగు వివిధబోధనా పదతులద్వారా పౌరధర్మాలను, నిర్వర్తించేందుకు, చక్కనిపాఠాలు, (విద్య) ప్రకృతి శాస్త్రం, చేతిపనులు (వృత్తివిద్య) జూనియర్ రెడ్ క్రాస్, స్కేటింగ్, సంగీతము, మున్నగు విషయాలను బోధించడమేకాక, శరీరవ్యాయామానికి అవసరమయ్యే అనేక విషయాలు (ఆటలుపాటలు) నేర్పి, వున్నత విద్యకు అవసరమయ్యే దారి చూపుతుంది. చిన్నపిల్లల వినోదానికై సినిమా, రేడియో మ్యాజిక్ లాంతర్లను విరివిగా వినియోగించేటట్లు చూస్తుంది ప్రభుత్వం. దృశ్యప్రదర్శనములద్వారా పలురకములయిన పెద్ద పటములను, పరికరములను మోటారు కార్లలో వుపన్యాసకులు నిర్ణీతమైన కేంద్రాలకు తీసుకొనిపోయి, అనేక విజ్ఞాన విషయాలు బోధించి పిల్లలను ఆనందాబ్ధిలో ఓలలాడిస్తారు.

ప్రారంభవిద్యా కేంద్రాలలో బిడ్డలకు మంచిశీలము, ఉన్నతాశయాలు, సామా

# :: ఇ. యస్. యల్. సి. పరీక్షలు 1952 ::

1952 సం॥ ఏప్రిలునెలలో జరుపబడు గవర్నమెంటు పరీక్షకు నేటివరకు ఇంగ్లీషు పాఠ్యపుస్తకములు సప్లయికాలేదు. గవర్నమెంటుప్రెస్ వారిని అర్థించగా తమఏజెంటు హిగిన్ బాదమ్సు, మద్రాసుకు వ్రాసుకోమని జవాబిచ్చిరి. హిగిన్ బాదమ్సువారికి వ్రాసుకొనగా స్టాకులేదు. క్రొత్తస్టాకు వచ్చిన వెంటనే (15 రోజులలోగా) పంపబడునని బదులువ్రాసిరి. ఇప్పటికి సుమారు మూడు నెలలక్రిందటనే మాకు యీజవాబందినది. పాఠశాలలు ప్రారంభమై 6 నెలలు ముగియ వచ్చినవి. ఇక సెలవులుపోను మిగిలిన 3 నెలలకాలమే పరీక్షలకు అవధియున్నది. ఈ కొద్దికాలములో ఇంగ్లీషుపాఠ్యపుస్తకమును ముగించి, పిల్లలనుతరిబీదుచేయుట సాధ్యము కానిపనియని చెప్పకతప్పదు. కాబట్టి సప్లై లేని హయ్యర్ ఎలిమెంటరీపాఠశాలల ప్రధానోపాధ్యాయులెల్లరు, ప్రభుత్వమువారికి, త్వరలో పాఠ్యపుస్తకములను సప్లై చేయవలయుననియు, సంవత్సరమునకునిర్ణయించిన పుస్తకములో మూడింట ఒకవంతు పాఠములు మాత్రమే పరీక్షకు, నిర్ణయించవలయుననియు, విజ్ఞప్తులు పంపుకొనవలయునని ప్రార్థించుచున్నాను. అట్లుప్రభుత్వమువారు కనికరించనిచో, పరీక్షలో కూర్చొనువిద్యార్థులకే యీదెబ్బయనివిన్నవించుచున్నాను.

రొద్దం,
6-11-51.

సి. కృష్ణమూర్తిరావు
హెడ్మాష్టరు, బోర్డుహైయ్యర్ ఎలిమెంటరీస్కూలు

---

౨౦3 వ పేజీ తరువాయి

జిక చైతన్యం, మొదలైనవాటితో సంపూర్ణ వికా సంపొందిన విద్యార్థులను తయారుచేయడానికే అమెరికాప్రభుత్వం తన యావచ్ఛక్తిని ధారవోసి ప్రయత్నిస్తూవున్నది.

మూడు మొదలు అయిదు సంవత్సరముల వయస్సుగల బాలురు పాఠశాలల్లో చేరకమునుపే, ఆటపాటల్లో శిక్షణయిచ్చేందుకు అనేక ఆటవస్తువుల సముదాయముతో, ప్రత్యేక శిక్షణాలయములులెక్కకు లేనన్నివున్నవి. వికలాంగులైన కుంటి, గ్రుడ్డి, చెవిటి మున్నగువారికిఅవసరమయ్యే ప్రత్యేకవిషయాలు నవీనపద్ధతుల్లోబోధిస్తూవున్నారు. ఏ ఒక్కజాతి బాల బాలికలను ప్రత్యేకముగాఁ జూడక అందరిని సుశిక్షిత పౌరులుగా, దేశభక్తులుగా. తయారుచేసి దేశసౌభాగ్యానికి, విశ్వమానవకల్యాణానికి తోడ్పడేటట్లు అమెరికా చేస్తున్నది.

పట్టణములలోని కేంద్రాలును, గ్రామీణకేంద్రాలును, సాయంకాలమందు వయోజనులకుకూడ వుపయోగ పడుచున్నవి .వీరు సభలు, ప్రత్యేకసమావేశాలు వుత్సవాలు, మున్నగునవి జరుపుకొనేందుకు ఇక్కడ సమావేశమౌతూ వుంటారు. సరదాగా పాడుకోవడమో, కాలక్షేపం చేయడమో, చర్చించుకోవడమో, జరుగుతూవుంటుంది.

అమెరికాలో ఈవిద్యావిధానము రాష్ట్ర శాసనసభవారి ఆధ్వర్యమున ప్రత్యేకములైన కమిటీలద్వారా, నిర్వహించబడుచున్నది. అవసరమైనపుడు అదనపు సౌకర్యాలనుకూడ కలిగిస్తూ ప్రజాబిడ్డలవిద్యాభివృద్ధికై నిరంతరం అభ్యుదయపథానపురోగమిస్తున్నది. ఈదేశంలో అమెరికన్లు యిచ్చేపన్నులు, విరాళాలద్వారానే ఈ వుచిత విద్యాలయాలు నిర్వహింపబడుతూ. దినదినాభివృద్ధిగావించుతూ, ఆదర్శనీయంగా వున్నాయ్.

"జై భారత్"

# శ్రీ మద్రాసు విద్యాశాఖా మంత్రిగారికి

మద్రాసు శాసనసభ్యులద్వారా - విద్యాశాఖాధికారుల ద్వారా,
**ఆంధ్రరాష్ట్ర ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు టీచర్లు, మేనేజర్లు
సమర్పించుకొను విజ్ఞప్తి.**

అంశము.—ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూళ్ళలోని మేనేజర్లు తమ టీచర్లకు తల 1-కి నెలకు రు 3/-లు తప్పక నీయవలెనని నిర్బంధించడం చాల అన్యాయం. ప్రత్యేక కమిటీని వెంటనే నియమించి యధార్థపరిస్థితులను ప్రభుత్వం తెలుసుకోవాలి.

ఆర్యా!

గ్రాంటు యిన్ ఎయిడ్ కోడ్ ప్రారంభమైనది మొదలు ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూళ్ళ మేనేజర్లు తమ స్వంతద్రవ్యమును వెచ్చించక పోయినను, ప్రభుత్వగ్రాంటుతోనే తమ పాఠశాలలను నిర్వహించుకొనుటకు ప్రభుత్వమువారు ఎట్టి ఆక్షేపణలను ఇంతవరకు పెట్టియుండలేదు. లోగడపరాయి ప్రభుత్వంలో ఉపాధ్యాయుల కీయబడు గ్రాంటునుండి 15% మించని మొత్తాలను పాఠశాల ఖర్చులకై మేనేజర్లుతీసుకోవచ్చునని రూల్సునం దుండెడిది. ఆరూల్సును కాంగ్రెసుప్రభుత్వమువారు రద్దుచేసి, మేనేజర్లకు బడిఖర్చులకై వేరే మొత్తములను మంజూరుచేయుచు యుపాధ్యాయులు వారి గ్రాంట్లనైనా వారు పూర్తిగా అనుభవించే అవకాశమును కలిగించారు - సంతోషమే.

మేనేజర్లు తమ స్వంతధనమును కొంత తమ పాఠశాలల నిర్వహణకై తప్పక వెచ్చించి తీరవలెనని నిర్బంధన రూల్సునందు లోగడ లేనందున అనేకమంది బీద టీచరుమేనేజర్లు సహితం పాఠశాలల మేనేజిమెంట్లను నిర్వహించు చున్నారు. 'ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూళ్ళు ప్రాథమికవిద్యావ్యాప్తికై చేయుకృషి ప్రశంసనీయమైనది' అని లోగడ ప్రభుత్వాలచే పేరుప్రఖ్యాతులుకూడా పొందినవి. ఇప్పుడు అట్టిస్కూళ్ళ పరిస్థితి తారుమారైంది. మేనేజర్లు తమ టీచర్లకు తల 1-కి నెలకు రు 3/-లచొప్పున యివ్వాలనియు, అట్లు యివ్వనిచో మేనేజర్లకివ్వబడు మెయింటినెన్సు గ్రాంటు నుండి ఆమొత్తమును కోసి యుపాధ్యాయుల కిచ్చెదమనియు, స్కూళ్ళ రికగ్నిషనులను తీసివేయుదుమనియు, వివిధ రకాలుగా ప్రభుత్వంవారు ప్రకటిస్తున్నారు.

ఎయిడెడ్ స్కూళ్ళు చాలభాగం టీచరు మేనేజర్లచే నడుపబడుచున్నవి. వీరుసామాన్యటీచర్లేకాని, ధనవంతులుకారు. పైగా వీరి కివ్వబడు మెయింటినెన్సు గ్రాంటులకు నిలకడలేదు. అదిపూర్తిగా పరీక్షాధికారుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడియుండి టీచింగ్ గ్రాంటుపై 0% మొదలు15%వరకు యివ్వబడుచుండును. వస్తువుల ధరలన్నియు చుక్కలుచూస్తున్న యీ రోజులలో ఈ మెయింటినెన్సుగ్రాంటును పెంచాలని మేనేజర్లు చేయుచున్న ఆందోళనను ప్రభుత్వం

పెడచెవిని పెట్టింది. అంతేకాకుండా ఈ స్వల్పమైన మెయింటినెన్సుగ్రాంటులోకూడా కోతలుకోసి, ఆ డబ్బును ఉపాధ్యాయుల కిస్తామని కంకణంకట్టుకొన్నది మన ప్రజా ప్రభుత్వం. మేనేజర్లకు 0% మెయింటినెన్సు గ్రాంటు మంజూరు చేయబడిన సందర్భమున యేగ్రాంటునుండి కోతలుకోసి ఈ రూ 3/- లు టీచర్ల కిస్తారో తెలుసుకోవలసియున్నది. ఈరకంగా మేనేజర్లనుచిన్న చూపుచూస్తే ఉపాధ్యాయులోకం తృప్తి పడుతుందని ఆశించారు కాబోలు.

అటుప్రక్కన ఉపాధ్యాయలోకం ఏలా మగ్గిపోతుందో పరిశీలించాలి. గ్రాంటు యిన్ ఎయిడ్ పద్ధతి పూర్తిగా ఎత్తివేసి ఏమేనేజిమెంటులో పని చేయుచున్నను, సమానయోగ్యతలు కలిగి ఒకేరకమైన బాధ్యతలను నిర్వహించుచున్న ప్రాథమికోపాధ్యాయుల జీతాలలోగాని, తదితర సౌకర్యాలలోగాని, తరతమభేదాలు లేకుండా ప్రభుత్వం చేయాలని యుపాధ్యాయ సంఘాలు ఎంతగా గగ్గోలుపెట్టినా అవన్నీ అరణ్యరోదనాలైనాయి. ఈ రూ3/- లు ఎయిడెడ్ టీచర్లకు ప్రభుత్వమే యివ్వాలని చేస్తున్న ఆందోళన పెడచెవిని పెట్టబడుచున్నది. టీచర్లకు రిక్తహస్తులైన ఈబీదటీచరుమేనేజర్లను చూపుచు వారివద్ద నుండి ఈ రు3/-లు తీసుకోండని ప్రభుత్వం అనడం ఉపాధ్యాయలోకాన్ని హేళన చేయడమేనని మా విశ్వాసం.

ప్రభుత్వసహకారం యిట్లుండగా ప్రజల సహకారం ఎట్లున్నదో పరిశీలించండి. పరిసరాలలోను లోకల్ బోర్డుపాఠశాలలలో ఉచితంగా విద్య నేర్పుతుంటే, జీతాలిచ్చి ఎయిడెడ్ పాఠశాలలలోనికి ఎవరు వస్తారు ? వచ్చినా ఈరోజులలో ప్రాథమికవిద్యను 5 తరగతులవరకైనా, అన్ని తావులందు ఉచితంగాను, నిర్బంధంగాను, గఱవు బాధ్యత ప్రభుత్వం వెంటనే తీసుకోవాలని మారుమ్రోగే యీ రోజులలో ఎంతకాలం వారు జీతాలిస్తారు ? జీతాలు వసూలుచేస్తే ఆస్కూళ్లకు మెయింటినెన్సుగ్రాంటు 'O' పెడ్తామని పరీక్షాధికారు లంటూవుంటే ఏ మేనేజరు సాహసించి జీతాలు వసూలు చేస్తాడు ? అటు ప్రభుత్వముయొక్కగాని, ఇటు ప్రజలయొక్కగాని సహకారములేనిదే సామాన్య టీచరుమేనేజర్లు తమ టీచర్లకు ఈ రు 3/- లు ఏలా యివ్వగలుగుతారు ? ప్రస్తుతానికి పళ్ళబిగింపుతో అలా యిస్తామన్నా ఎల్లకాలం యివ్వగలుగుతారని గ్యారంటీ ఏమున్నది ? ఇట్టి అంశాలను ప్రభుత్వంవారు ప్రశాంతంగా విచారించవలసిన అవసరం ఎంతేని యున్నది.

ఈ రు 3/-లు టీచర్లకు యివ్వనిచో తనస్కూలు రికగ్నిషను ఎగిరిపోతుందనే భీతావహముతోగాని, తనకీయబడు మెయింటినెన్సుగ్రాంట్లు తగ్గింపబడుతుందనే ఆతురతచేగాని, కొన్నిస్కూళ్ళమేనేజర్లు ఈమూడు రూపాయలు ముట్టినట్లుగా, తమ ఉపాధ్యాయులను సంతకము చేయవలసిందిగా నిర్బంధించుచుండవచ్చు ప్రస్తుతం సంతకాలు పెట్టినా, ఎల్లకాలం యిదేవిధంగాఉపాధ్యాయులు సంతకాలు పెడ్తారని గ్యారంటీ ఏమున్నది ? అని మేనేజర్లు ఆందోళనపడుచుండవచ్చు.

ఇలా సంతకాలు పెట్టకపోతే స్కూళ్ళ రికగ్నిషనులు ఊడి తమకుగల లోగడ సర్వీసంతయువృథాయగుటయేగాక, నిరుద్యోగ సమస్య నెదుర్కొనవలసివచ్చుననియెడి

భయోత్పాతముతో కొందరు యుపాధ్యాయులు మేనేజర్లతో కలహించి లాభం లేదనుకొని అక్విటెన్సులలో ఈ రు 3/- లు ముట్టినట్లు ప్రతిఫలశూన్యంగా సంతకములు చేయుచుండవచ్చు. ఇందువిషయమై ఎంక్వయిరీలు చేయుట కష్టసాధ్యము. గాన పరిపాలాధికారులు చాలమంది ఈ విషయములో పోక్యం ఆట్టే కలిగించుకోక, మేనేజర్లు చాలవరకు రు 3/- లు యిస్తామంటున్నారని ప్రభుత్వానికే రిపోర్టులు పంపుచుండవచ్చు. ఈవిధంగా మేనేజర్లు, టీచర్లు గుద్దుకొనేటట్లుచేస్తే, వీరెవరుఇకమీందటజీతాలు పెంచమనిగాని, అలవెన్సులు హెచ్చించమనిగాని, తమవద్దకు రారని ప్రభుత్వం భ్రమపడుచున్నదేమోనని అనుమానపడవలసి వచ్చుచున్నది. ఈ తెంచాటు భాగవతాలవల్ల అటు ప్రభుత్వానికిగాని, ఇటు ఉపాధ్యాయులకుగాని, మరి యింకెవరికీగాని, ఎటువంటిలాభంలేకపోగా, పైపెచ్చు విద్యాలోకంలో అవినీతి ప్రబలిపోతుందని చెప్పకతప్పదు.

స్వతంత్రభారతదేశంలో అక్షరాస్యుల సంఖ్య ఒకప్రక్క అడుగంటిపోతుంటే, కాంగ్రెసుప్రభుత్వం ప్రాథమికోపాధ్యాయులకు జీతాలు పెంచకపోగా, మేనేజర్లకవసరమగు బడిఖర్చుల నన్నింటినీ మంజూరు చేయకపోగా, పైపెచ్చు మేనేజర్లు-ఉపాధ్యాయులు కుమ్ములాడుకొనుటకై ఈ 3 రూపాయల మహామారిని విద్యాలోకంపైకి స్వేచ్ఛగా వదిలారు. మేనేజర్లు, టీచర్లు, ఈ విధంగా ఆందోళనకు గురియైనపుడు, ప్రశాంతవాతావరణం లేనప్పుడు, విద్యావ్యాప్తి కుంటుపడుతుందని వేరే చెప్పాలా? ఇదేనా విద్యావ్యాప్తికై కాంగ్రెసువారు ఈ నాలుగేండ్లనుండి చేసిన సేవయని వ్యాఖ్యానాలు చేయుటకు పూర్తి అవకాశాలు కలుగటంలా? ఈ రు 3/లు యివ్వలేని మేనేజర్ల స్కూళ్ళ రికగ్నిషనులు తీసివేసి, అందు సర్వీసుగల ఉపాధ్యాయులను అధోగతిపాలు చేయకుండ, సదరు స్కూళ్ళను, ఉపాధ్యాయులతోసహా ప్రభుత్వమే తీసికొని నడుపతామంటే ఉపాధ్యాయలోకానికి ప్రభుత్వంపై అమితమైన విశ్వాసం కలుగుతుందని మా నమ్మకం.

కాన ఈ రు 3/-లు యివ్వలేని బీద టీచరుమేనేజర్లపై కాని, వారి ఉపాధ్యాయులపై గాని ప్రస్తుతానికి ఏలాటి చర్యలను దీసికొనక, రాజధానియందలి, వివిధప్రాంతములలో ఈ రు 3/-లకు సంబంధించిన యథార్థములను పరిశీలించుటకును, విద్యావ్యాప్తి చురుకుగా జరుగుటకును, అవసరమగు మార్గముల నన్వేషించుటకును, విద్యావేత్తలతోను, ఉపాధ్యాయప్రతినిధులతోను, గూడిన ఒకకమిటీని నియమించవలసినదనియు, ఆ కమిటీవారిచ్చే సూచనల ప్రకారం అవుసరములగు మార్పులను, చేయవలసినదిగా ప్రభుత్వమువారిని కోరుచున్నాము.

తమ విశ్వాసపాత్రులు
ఆంధ్రరాష్ట్ర ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూళ్ళ
టీచర్లు, టీచరుమేనేజర్లు.

## ఉపాధ్యాయులకు మనవి

ఆర్యా !

పై మహాజరును తయారుచేసుకొని వాటిపై సంతకములుచేసి ఒక కాపీని విద్యాశాఖా మంత్రి గారికిని, మరి ఒక కాపీని ఈ దిగువ అడ్రసుకును, పంపిన మరల మేము ఈ నెలాఖరున మంత్రిగారిని కలుసుకొన్నప్పుడు దీనిపై చర్చించుటకు అవకాశముండును ఈ రకమైన మహజర్లు ఇంతవరకు మంత్రిగారికి కొన్ని వందలుగా చేరుచున్నవని తెలియుచున్నది ఆలస్యం చేయవద్దని మనవి

కొత్తపల్లి సీతారామయ్య, టీచరు – మేనేజరు,
R. అగ్రహారము, గుంటూరు

---

# :: ముందు నడువు మోయ్ ::

రచన చక్రాల తిరుపతిరాజు

ముంగునడువుమోంపె ! వేగనడువుమోయ్ !
నడూ నడూ ముంగు నడువు మోయ్ !
నీ దేశవిద్య నేర్చుకొనగ దారితీయుమోయ్ !
విద్యాభిమానులంత నీకువెనుక నుండిరోయ్ ! 1

వేడిరక్తముప్పొంగెడు యువకుల మీరోయ్ !
మీ దేశ సౌభాగ్యముపై బాధ్యుల మీరోయ్ !
మీగ్రామప్రజల మంచిచెడులు మీరు గాంచరోయ్ !
మన భావివిద్య బాగుజేయు బాధ్యులు మీరోయ్ !

మనదేశమందు అవివేకము బాపగ రండోయ్ !
కులమతములందు ప్రుళ్ళు వేగ తీసివేయం డోయ్ !
ఐక్యవిద్య అందుకొనగ అందరు రండోయ్ !
మీ అందరిలో ఐక్యత పెంపొంద జేయండోయ్ ! 3

గ్రామగ్రామమందు బడుల బాగుజేయాలోయ్ !
బాగుచేయు బాధ్యతంత యువకులదేనోయ్ !
విద్యయందు రుచిగల్గే విధులు చూడండోయ్ !
స్త్రీవిద్యయందు మీదుశక్తి ధారపోయండోయ్ ! 4

దేశదేశ ఎన్నికలు మీదరికి చేరెనోయ్ !
మీదగ్గరున్నదేదైనా ఒక్క ఓటేనోయ్ !
మీగ్రామమందు పలురకాల పార్టీలుండెనోయ్ !
నీఓటు సద్వినియోగపర్చ భారము నీదోయ్ ! 5

నీ ఓటువిలువ తెలిసికొనగ వేగము రండోయ్ !
విలువతెలిసే విద్య మీరు వేగ నేర్వండోయ్ !
విలువ తెలియకుండ మీరు నిలువలేరండోయ్ !
విలువనగనేమొ మీగ్రామబడిలో నేర్వండోయ్ !

భారతాధనేత నెహ్రూపండితు డేనోయ్
మీ యువ బృందమంత వేగ ఓటుచేయాలోయ్
మదికింక చెరపులేల మనకు కాంగ్రెసుండెనోయ్
రెండెడ్లను కట్టినకాడీ కదలుచుండెనోయ్ ! 7

ముంగు నడువుమోయ్ ! వేగ నడువుమోయ్
నడూ నడూ వేగ నడువుమోయ్
నీ దేశవిద్య నేర్చుకొనగ దారితీయు మోయ్
విద్యాభిమానులంత నీకువెనుక నుండిరోయ్ ! 8



# మెట్ట వేదాంతం

జొర్ఝువరపు వెంకటేశ్వరరావు

వేదాంతం తెలియని
వేదాంతికు డొకడు
'మెట్ట వేదాంతమును
మహోపదేశించుచు
మానవు లందరను
మోసపుచ్చుచు
రాజ్యంలో తుదకు
రాజువద్దకు చేరి
డప్పాల్ గొప్పగజెప్పి
డబ్బులు కాజేశాడు.
వేదాంతికుని మాటలు విని
వేదాంతం తెలుసుకొని రాజు
అంతఃపురమున కేగి తన
కాంతతో నిట్లన్నాడు.—
"నేటినుండి నారాజ్యంలో
'నా' 'నీ' యను భేదం లేదు
'అంతా యొకటే' వే
దాంతసారం యిది.
రాణియెంతయో నాకు
రాణిదాసియు నంతే
కావున నేడే దాసి నా
కాంత యవుతుం" దన్నాడు.
పతిమాటలు వింటుంటె
సతికి మతిపోయిందీ!
ఊహాలోకంలో రాణీకి
ఉపాయ మొకటి తట్టిందీ!

భూమీంపతి వేళకు
భోజనమునకు రాగా
అన్నం వున్న పళ్ళెరంలో
సున్నంకూడా వడ్డించిందీ!
అదిచూచి రాజు గ్రుడ్లై
"ఇదియే"మని అడిగాడు.
"వేదాంతం తెలిసిన
వేదవేదాంతికులకు
భేద మిసుమంతయు
లేదుగదా యని తలచి
అన్నపు పళ్ళెరంలో
సున్నం వడ్డించాను
ఆహారం వెంటనే
ఆరగించండ"న్నది రాణి.
రాణిపలుకులు విని
రాజు వెంటనే తన
తప్పు తెలుసుకొని
రాణితోనే సుఖంగా
రాజ్యం చేస్తున్నాడు.
బాలబాలికలారా!
విన్నారా యీవింతకథ
కనుక మీరుగూడ
కల్ల సన్యాసులయొక్క—
మెట్ట వేదాంతముల
గుట్టు దెలిసి నడవండీ!



# మద్రాసు ప్రభుత్వ ఫర్మానాలు

## (i) GO No. 1823 Education Dated 3rd July 1951

లోకల్ బోర్డులలోని ఉద్యోగుల లేక ఆఫీసరుల యింక్రిమెంట్లు, అలవెన్సులు, జీతముల బకాయీల చెల్లింపు విషయమైన నిబంధనల ముసాయిదా సవరణ

1. * నిబంధనలోని 2. వ క్లాజుకు బదులు యీ క్రిందిది చేర్చవలెను.

2. మునిసిపల్ కౌన్సిల్/జిల్లాబోర్డు . యొక్కయు మరియు డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ యిన్స్ట్రక్షన్ యొక్కయు లేదా లోకల్ బోర్డు మునిసిపాలిటీల యిన్స్పెక్టరు యొక్కయు మంజూరుపై ఆయా ఉపాధ్యాయుల లేదా ఉద్యోగుల బకాయీలు ఒక సంవత్సర కాలమునకు మించిన కాలమునకు చెందినవైనచో తీసుకొనవచ్చును.

## (ii) GO. No. 1847 Education Dated 5th July 1951

లోకల్ బోర్డులలోని ఉద్యోగుల నియామకము, శిక్షాస్మృతికి చెందిన నింబంధనల ముసాయిదా సవరణ

పై నిబంధనలకు చెందిన నిబంధన 9 (2) లో క్లాజు (b) యందలి సబ్ క్లాజు 1. లో "ప్రాథమిక పాఠశాలలోని ఉపాధ్యాయ వర్గము అను "మాటలకు బదులు" "ప్రాథమిక పాఠశాలలోని ఉపాధ్యాయవర్గము, నౌకరులు, నిమ్న సేవకులు(Menials)" అనుమాటలు చేర్చబడవలెను.

## (iii) GO. Ms. No. 2191 Education Dated 14th Aug 1951

మద్రాసు విద్యానింబంధనలకు (MER) చెందిన సవరణ

మద్రాసు విద్యా నింబంధనలో అనుబంధము 5 (అధ్యాయము 3 నిబంధన 34) లోని ట్రాన్స్ఫర్ సర్టిఫికెట్ (Transfer Certificate) ఫారములో 8 వ ఐటము తరువాత 8 A. అను ఐటముగా యీ క్రిందిది చేర్చుకొనవలెను.

"8 A. విద్యార్థి ఏదైన ఛాత్రవేతనము (Scholarship) పొందుచున్నాడా (అటులైన ఏరకము ఛాత్రవేతనమో తెలుపవలెను.

## (iv) GO Ms. No. 2346 Education dated 3rd Sept 1951

మద్రాసు విద్యా నిబంధనలకు సవరణ

1. మద్రాసు విద్యా నిబంధనలోని 13 వ నిబంధనలోని సబ్-పేరా 9 కు చెందిన 1 వ ఐటములోని "నేతపనియందు ఆర్టిజాన్ కోర్సు" అను మాటల తరువాత కామా పెట్టి యీక్రింది మాటలు చేర్చవలెను.

"లేదా యిన్స్ట్రక్టర్స్ కోర్స్ యిన్ హెండ్లూం వీవింగు"

2. మద్రాసు విద్యానిబంధనలలోని 13వ నిబంధనలో అసిస్టెంటు మాన్యుయల్ ట్రైనింగ్ యిన్‌స్ట్రక్టరుల యోగ్యతల క్రింద 2 వ ఐటములో "ఆర్టిజాన్‌కోర్సు" అను మాటల తరువాత యీ క్రింది మాటలు కామా పెట్టి చేర్చవలెను.
"లేదా చేనేతలో యిన్‌స్ట్రక్టరుకోర్సుకు చెందిన సర్టిఫికేట్టు"

**(V) ఫోర్టుసెంట్ జార్జి, 4వ సెప్టెంబరు 1951**

మద్రాసు విద్యా నిబంధనలకు సవరణ

మద్రాసు విద్యానిబంధనలోని 92 నిబంధనకు చెందిన అనుబంధము 17 A. లోని 3 వ లిస్టులో వెనుకబడిన జాతుల లిస్టు యివ్వబడినది దానిలో

30 వ ఐటములో 'గహిక అను మాటతరువాత 'నాగవంశము సహా' అను మాటలు బ్రాకెట్లలో చేర్చవలెను.

54 వ ఐటములో కమ్మలనుట (కంసాలులు మరియు విశ్వబ్రాహ్మణులు) అను బ్రాకెట్లలోని మాటలకు బదులు "కంసాలులు, విశ్వబ్రాహ్మణులు మరియు విశ్వకర్మలు" అను విధముగా బ్రాకెట్లలో పెట్టుకొనవలెను.

84, 85 ఐటముల మధ్య 84 A అను ఐటముగా "84 A మొగవీర" అనుమాట చేర్చవలెను.

85, 86 ఐటముల మధ్య 85 A అను ఐటముగా "85 A మొనియగారు" అను మాట చేర్చవలెను.

**(vi) G.o. Ms. No.2473, Education Dated 15th Sept 1951**

ప్రాథమికపాఠశాలల ప్రభుత్వామోదము ద్రవ్యసహాయము (**Recognition and aid**) కు చెందిన నిబంధనల సవరణలు

పై నిబంధనలలో

(1) అధ్యాయము I లోని నిబంధన 28-Bకి చివర సబ్-పేరాగా యీ క్రిందిది చేర్చవలెను.

"పాఠశాలల మేనేజిమెంటువారు డిపార్టుమెంటువారు ఏర్పరచిన కేంద్రములలో తిరిగి శిక్షణపొందుటకై బేసిక్ ట్రైనింగ్ శిక్షణకు సరియైన కారణము చూపకుండా తమ యుపాధ్యాయులను పంపకపోయినచో ఆపాఠశాల లేక పాఠశాలల రికగ్నిషను ఉపసంహరింపబడవచ్చును.

(2) అధ్యాయము II లోని 24 వ నిబంధన క్రింద (e) అను ఐటములో యీ క్రిందిది చేర్చవలెను.

"ఏపాఠశాల సరియైన కారణముచూపక తన ఉపాధ్యాయులను డిపార్టుమెంటువారు నిర్వహించెడు బేసిక్ ఎడ్యుకేషన్ శిక్షణలో తిరిగి శిక్షణపొందుటకై పంపకుండునో"

అనువాదకుడు—శ్రీ చింతలపాటి శివశంకరం.

# 1952

## 12 నెలల క్యాలెండరు

| జనవరి 31 | ఫిబ్రవరి 29 | మార్చి 31 | ఏప్రియల్ 30 | మే 31 | జూన్ 30 | | | | | | జూలై 31 | ఆగష్టు 31 | సెప్టెంబరు 30 | అక్టోబరు 31 | నవంబరు 30 | డిశంబరు 31 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మ | శు | శ | మ | గు | ఆ | 1 | 8 | 15 | 22 | 29 | మ | శు | సో | బు | శ | సో |
| బు | శ | ఆ | బు | శు | సో | 2 | 9 | 16 | 23 | 30 | బు | శ | మ | గు | ఆ | మ |
| గు | ఆ | సో | గు | శ | మ | 3 | 10 | 17 | 24 | 31 | గు | ఆ | బు | శు | సో | బు |
| శు | సో | మ | శు | ఆ | బు | 4 | 11 | 18 | 25 | ❀ | శు | సో | గు | శ | మ | గు |
| శ | మ | బు | శ | సో | గు | 5 | 12 | 19 | 26 | ❀ | శ | మ | శు | ఆ | బు | శు |
| ఆ | బు | గు | ఆ | మ | శు | 6 | 13 | 20 | 27 | ❀ | ఆ | బు | శ | సో | గు | శ |
| సో | గు | శు | సో | బు | శ | 7 | 14 | 21 | 28 | ❀ | సో | గు | ఆ | మ | శు | ఆ |

పూర్వరులు.

1. కాశిన ఆదినారాయణ - గరులియా, పశ్చిమ బెంగాల్
2. గుండేపూడి హనుమంతరావు - శనివారపు పేట
3. కలిదిండి సత్యనారాయణరాజు - టీచరు, మొయిద.
4. ఆణివిళ్ళ లచ్చారావు - టీచరు, మెరక చామవరము.
5. పూలపల్లి సైనాచార్యులు - హెడ్మాష్టరు, వైకుంఠలక్ష్మీపురం,
6. యం. వేంకట్రావు పట్నాయక్ } వేణమ్మపేట.
7. కె. వి. అప్పారావు }

# వివేక ప్రశ్నలు

౧. అక్కరములు నాల్గు – అవనికిఁ బేరొప్ప,
మొదలు చివర చెఱుప – మూర్ధమగును,
ఒకటి మూడు నాల్గు – ఒనరంగ కులమగు,
అట్టి శబ్దమేదొ – అరసిచెపుడు.

—ఉద్దగిరి అప్పలనరసయ్య,
హెడ్మాష్టరు–వేచలపువాని పాలె

౨. అక్కరములు మూడు – అగు నొక్కనగరంబు,
ఆది చివర కూడి – యంత్రమగును,
ఒకటి రెండు చేరి – ఒప్పగా రుచియౌను,
అట్టి పదము చెప్పు – డన్నలార!

—యు. సీతారామయ్య,
టీచరు–మొగలిపురం.

---

## నవంబరు నెల చిత్రప్రశ్నలు

(1951 సం॥ నవంబరు నెల సంచికలో ప్రకటింపఁబడిన)

## వివేక ప్రశ్నలు

అను చిత్ర ప్రశ్నలకు సమాధానములు

**౧, మగపిచ్చుక. ౨. వేదండము,**

* * *

చందా నెం. రెండు ప్రశ్నలకు సరియైన సమాధానములు పంపినవారు.

360 అల్లంరాజు సూర్యారావుగారు–హెడ్మాష్టరు–శృంగవరము
455 అల్లంరాజు బంగారం గారు–టీచరు కొంతంగి
444 కె యల్ నారాయణప్పగారు–హెడ్మాష్టరు–ముక్తాపురం
567 పేర్ల వెంకట్రావుగారు–టీచరు–పాములవల్సగ్రామం
82 కె. చంద్రాయుడుగారు–టీచరు–కొడవండ్లపల్లె
338 టి. పంపయ్యగారు–హెడ్మాష్టరు–ఇభరాం పురము
439 కణితి కొరు నాయుడు గారు–ముద్దపువాని పేట
135 యం కృష్ణమూర్తిగారు–సెక్రటరి–టి ఎ. సెంటరు–కోపాక
234 చక్రపాణి రాఘవరావు గారు–హెడ్మాష్టరు–కొత్తకోట
304 కాశిన ఆదినారాయణరావుగారు–గరులియా–పశ్చిమ బెంగాల్
569 కలిదిండి సత్యనారాయణరాజుగారు–టీచరు–మొయిద




## విజ్ఞప్తి

### ౧. వివేకప్రశ్నలు పంపువారికి—

మేము ప్రతిమాసము మాపత్రికలో ప్రకటించునవి రెండు వివేక ప్రశ్నలు మాత్రమే. ప్రశ్నలు పంపుటకు చందాదారులే పంపవలెనను నియమములేదు. ఇతరులు గూడ పంపవచ్చును. ఎవరు పంపినప్పటికి అవి అన్నివిధముల బాగుగా నున్నప్పుడే ప్రకటింపఁబడఁగలవు. సాధారణముగా చందాదారులకే తగినంత ప్రాధాన్యమిత్తుము. బాగుగ నున్న వాటిలో చందాదారులవే ముందుగా ప్రకటింపఁబడును. అయితే అందఱివి ప్రకటింపఁబడఁజాలవు. మేము ప్రకటించునవి రెండే గనుక వీలునుబట్టి తక్కినవి ఆయానెలలలో ప్రకటింపబడుచుండును. ఈయంశమును గమనింపక ఎవరికివారు "మావి ప్రకటింపలేదంటే మావి ప్రకటింపలే" దని ఇష్టము వచ్చినట్లు అతినిష్ఠురముగను, హేయముగను, ఉత్తరములు వ్రాయుట సబబుకాదు. ఆలాగున వ్రాయుటచే ప్రయోజనముండఁబోదు.

---

౨౧౩ వ పేజీ తరువాయి

270 భోగాపురపు సీతారామస్వామిగారు-హెడ్మాష్టరు-కొట్టిశ
484 కె. రామన్నగారు-రిటైర్డు టీచరు-కోడుమూరు
111 తుంపరామమూర్తిగారు-టీచరు-చింతపల్లి పేట
869 సైత్తం నరసింహులు-టీచరు-రామాపురం
115 జొన్నలగడ్డ దేవదానము-టీచరు-క్రొత్తూరు

మొదటి ప్రశ్నకు మాత్రమే

134 కవల వీరభద్రుడుగారు-టీచరు-గుడివాడ
575 త్యాడ రాజగోపాలరావుగారు-మేనేజరు-పనసపెద్దికోనవల్స
262 దోశల తమ్మిశెట్టి గారు-టీచరు-కింతలవాని పేట
283 మైలపల్లి నారాయణస్వామి-పెదమేడపల్లి

రెండవ ప్రశ్నకు మాత్రమే

402 రేగులవలస కల్యనారాయణ గారు-టీచరుమేనేజరు-గ్రాజుచీపురుపల్లి
140 తెన్మరం సత్యగోపాలాచార్యులు గారు-జి టి స్కూలు-అనంతపురం
800 టి వి జె. రామారావుగారు-హెడ్మాష్టరు- ముత్యాలపల్లి

సరియైనవి పంపినవారు వ్రాయుటలో కొంతయర్థమున్నది. ఎందుకు కొఱగానివి పంపినవారుగూడ వ్రాయుటయెందుకో బోధపడదు. ఏవేవో అర్థరహితములైన శబ్దములు కొన్నిగూర్చి ఒక లక్షణమన్నదిలేక, నాలుగుచరణములు గిలికి పంపినమాత్రాన అట్టివి వివేక ప్రశ్నలనిపించుకోవు. వానిని ప్రకటింపలేదని నిష్ఠురముగా జాబులు వ్రాయుట వివేకలక్షణమనిపించుకోదు. కాబట్టి వివేకప్రశ్నలు పంపువారు తాము పంపునవి ప్రకటనార్హములో కావో ముందుగా తామే నిర్ణయించుకొని పంపుట మంచిది. లక్షణయుక్తముగా పద్యములు రచింపనేరనివారు అసలు పంపకుండుట అంతకంటె మంచిది. ఈవిషయములో మా ఉపాధ్యాయసోదరులు ఈర్ష్యాద్వేషములకు లోనుగాక సరియైన వివేక ప్రశ్నలు వ్రాసి పంపవలసినదని మా విజ్ఞప్తి.

## ౨ సమాధానములు పంపువారికి

మా పత్రికకు చందాదారులు కానివారు సమాధానములు పంపునప్పుడు విధిగా రెండు అణాల తపాలాబిళ్ళలు పంపవలెను. అట్లు పంపినప్పుడే వారి పేర్లు ప్రకటింపఁబడును. లేకున్న త్రోసివేయఁబడును. మాచందాదారులకు మాత్రమీ నియమములేదు.

చందాదారులుగాని, తదితరులుగాని, తమ తమ సమాధానములను ప్రతినెల 6 వ తేదీలోగా సంపాదకునకు చేరునట్లు పంపవలెను. తరువాత పంపునవి ప్రకటింపఁబడఁజాలవు. వాటిని మఱుసటి నెలలో ప్రకటించుటకు వీలులేదు. కాబట్టి 6 వ తేదీ దాటి వచ్చినవి నిలిచిపోవును. ఈ విషయమును పత్రికాముఖమున మేము పదేపదే ప్రకటించుచునే యున్నాము. దీనిని గమనింపక మా సమాధానముల నెందుకు ప్రకటింపలేదు ? మీకీపక్షపాతమేల ?" అని వ్రాయుచున్నవారికి ఏమిసమాధానము చెప్పవలెనో బోధపడకున్నది.

మాదృష్టికి చందాదారు లందఱూ ఒక్కటే. మాకు పక్షపాత ముండుట కవకాశమే లేదు. కాబట్టి సమాధానములు పంపువారందఱు ప్రతినెల 6 వ తేదీలోగా సంపాదకునకు చేరునట్లు పంపవలసినదనియు, చందాదారులు గానివారు విధిగా రెండు అణాల పోష్టుబిళ్ళలు పంపవలెననియు, చందాదారులు తమ చందా నెంబర్లను తెలుపవలెననియు, ప్రకటింపఁబడనివి ఆలస్యముగా చేరినట్లు గ్రహింపవలెననియు, మా విజ్ఞప్తి.

## ౩. వ్యాసములు పంపువారికి—

వ్యాసములు పంపువారు తమరచనలకు శీర్షికల నెన్నుకొనుటలో తగినంత శ్రద్ధ వహింపవలెనని మామనవి. వ్రాయునట్టివిషయము ప్రాథమిక విద్యకు సంబంధించినదిగానుండుట లెస్స. ఏవిషయమునుగుఱించి వ్రాసినప్పటికి దానియందొక నూత్నచైతన్యము, ప్రత్యేకత, యుండునట్లు చూడవలెను. అనుభవమును పురస్కరించుకొనిస్వతంత్రభావములతో, నిర్మాణాత్మక దృష్టితో, రచించుట చాలమంచిది. వయోజనవిద్య—అందలి సాధకబాధకములు, జాతీయవిద్యాస్వరూపము, బోధనాంశములు, ప్రస్తుతబోధనపద్ధతులలోఁగల లోపములు, విదేశములలోని ప్రాథమిక విద్యావిధానమ్ము—దానివిలువ; విద్యాభి

వృద్ధికి నిర్మాణాత్మకములైన పద్ధతులు, మొదలైన విషయములను గురించియు, బాల సాహిత్యము-కథలు-గేయములు-(పూర్వకవులు రచించినవి) సంభాషణములు-నాటికలు-మున్నగువిషయములను గురించియు, స్వతంత్రముగా రచింపవలెనని మావ్యాసకర్తలకు మనవి.

ఏమి వ్రాసినప్పటికి పావుటావుసైజు కాగితముమీద ఒక ప్రక్కనుమాత్రమే-విడి విడిఅక్షరములతో, దూరపుబంతులతో, ఇరికించినట్లులేకుండ వ్రాయవలెను. సాధ్యమైనంతవరకు-వ్యావహారికభాషలో రచించినప్పటికి-శబ్దదోషములు, వాక్యనిర్మాణదోషములు, పునరుక్తి, లేకుండునట్లు చూడవలెనని ప్రార్థన.

**౪. వార్తలు పంపువారికి—**

సభలు--తీర్మానములను గురించి వ్రాసిపంపువారు సాధ్యమైనంతవఱకు క్లుప్తపఱచి, పేజీకి ఒకప్రక్కనే వ్రాసి, పంపవలెను. ఇంగ్లీషులో వ్రాసినవి యెంతమాత్రము పంపవద్దు. జయంతులు-వర్ధంతులు-సన్మానములు - మున్నగువానినిగురించి వ్రాయునప్పుడు చాలసంగ్రహముగా వ్రాసిపంపవలెను. ముఖ్యాంశములను మాత్రమే క్రోడీకరింపవలెను. స్థలాభావమువలన దీర్ఘములైనవి ప్రకటింపఁబడఁజాలవని మావిజ్ఞప్తి.

**౫, ఉత్తరప్రత్యుత్తరములు—**

చందాధనము పంపుటకుఁగాని, చిరునామాల మార్పులను దెలుపుటకుఁగాని ఏవైన ప్రకటన విషయములకు సంబంధించిన రేట్లను తెలిసికొనుటకుఁగాని, పత్రికలుచేరినది-లేనిది, చందాలు చెల్లించవలసినది-లేనిది మున్నగువిషయములను గురించికాని, సరాసరి "రామా అండ్ కో., ఏలూరు" హెడ్డాఫీసు వారితోనే ఉత్తరప్రత్యుత్తరములు జరుపవలెను. సంపాదకునకు వ్రాయవద్దు. ఏవైనా వ్యాసములనుగురించి వ్రాయునప్పుడు మాత్రమే సంపాదకునకు వ్రాయవలెను. సమాధానములు పొందగోరువారు, వ్యాసములను తిరిగి తమకు పంపగోరువారు, తపాలాచార్జీలు పంపవలెను.

—సంపాదకుఁడు.

---

**"కావలెను"** గొలుగువలస - ది 28-11-1951

శ్రీకాకుళముజిల్లా బొబ్బిలితాలూకా వంతరాము శంటరులోచేరియున్న గొలుగువలస ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలులో పనిచేయుటకు ఒక హయ్యరుగ్రేడు T T C యోగ్యతగల ఉపాధ్యాయుడు కావలెను సదరు టీచరునకు ప్రభుత్వమువారి నిర్ణీతపుస్కేలు ఇచ్చుచూ మానేజరు యిచ్చు అదనపు రు 3-0-0 లు యివ్వబడును ఆ ఉపాధ్యాయుడు అప్లికేషను మాకున్నూ మ రా శ్రీ బొబ్బిలి దక్షిణ రేంజీ J D I. గారికిని ది 28-12-51 తేదీలోగా పంపుకొనవలెను

గొలుగువలస,
ఆమటి B P O
బొబ్బిలి తాలూకా.

ఇట్లు,
పి. స్వామినాయుడు,
మానేజరు




15—12—1951 మొదలు 14—1—1952 వరకు.

మేషం—జయము, వస్త్రలాభము, ధనలాభము, ధాన్యలాభము, తద్వ్యయము, కీర్తి, పుణ్యప్రాప్తి, మనోల్లాసము, శుభ, పుణ్యకార్య వ్యయములు.

వృషభం—దాసీదాస భృత్యజనలాభము, ధనధాన్యములు, నిత్య మృష్టాన్న భోజనము, నీచ స్త్రీభోగ సంతాపము, గాయాదాగులతో వ్యాజ్యములు మనస్తాపము

మిథునం—ధనధాన్య వస్త్రలాభములు, మనోధైర్యము, విద్యావినోదసౌఖ్యము, భయభ్రాంతి, స్థానచలనము, (ప్రయాణము) వాతశూల, మనఃపీడ.

కర్కాటకం—మనస్సౌఖ్యము, సదానందం ఇష్టగృహ సుభోజనము, విజయం, గృహమున వివాహాది శుభ కార్యములు

సింహం—అంతఃక్లేశము, అసహిష్ణుత, గృహచ్ఛిద్రములు, సౌఖ్యహాని, అభోజనమున్న

కన్య—అర్థహాని, బంధువిరోధము, సంఘవైరము, బుద్ధివైకల్యము, స్థానచలనము, హృదితాపము

తుల—అర్థలాభము, చిత్తసౌఖ్యం, అన్యస్త్రీ భోగము, యత్నకార్యసిద్ధి

వృశ్చికం—ఆరోగ్యము, ద్రవ్యలాభము, సంతోషం, వస్త్రలాభము, యత్నకార్యానుకూలత్వము, ధైర్యం.

ధనుస్సు—యాచన, బుద్ధిచాంచల్యము, తేజోహాని, ధనవ్యయము, కలహం, స్థానచలనము

మకరం—ఉద్యోగ భంగసూచన, దేహపీడ, బంధుకలహము, క్వచిద్ద్రవ్యలాభము, క్వచిత్సుఖము, స్వదార సుత క్లేశములు

కుంభం—ధనధాన్యాభివృద్ధి, మనఃక్లేశము, బహువ్యయము, సౌభాగ్యం, కీర్తి, సత్కార్యాచరణము.

మీనం—రాజకోపము, ఉద్యోగ విరోధము, భయము, బుద్ధిభ్రంశము, యథాలాభవ్యయములు, గృహమందు శుభకార్యాడంబరములు, ప్రయాణ సన్నాహములు

(మీ జాతకమందలి గ్రహచాలనము ననుసరించి గోచార భావఫలములు పరిణామముగా జరుగుచుండును)

☞ సిద్ధయోగినీ, నాడీజ్యోతిష శాస్త్రరీత్యా జాతక, ముహూర్త, వాస్తు,ప్రశ్న విషయములు, గ్రహపీడాది సర్వబాధలకు చికిత్సలు, మళయాళ మహాకాళీకుట్టీ యామిళ,యోగినీ-కవచయంత్రరాజములు, సరసముగా సరళముగా తెలుపబడును

వలయువారు నిలయముపేర వ్రాయవలయును

దైవజ్ఞభూషణ, భిషగ్రత్న, పండిత డి. యస్. యన్. శాస్త్రి,

పవరుపేట-ఏలూరు. (పశ్చిమగోదావరిజిల్లా)






## ఉపాధ్యాయులకు సువార్త

ది 11—11—51 తేదీన విజయవాడలో జరిగిన ఆంధ్ర కాంగ్రెస్ ప్రతినిధుల సమావేశసందర్భమున వివిధప్రాంతములనుండి వచ్చిన ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు టీచర్లు, టీచరు-మేనేజర్ల సంఘాల వర్కర్లు, శ్రీ కొత్తపల్లి సీతారామయ్యగారి దర్శకత్వమున మేనేజర్లు ఇవ్వవలసిన అదనపువేతనము రు 3లను గూర్చి విజయవాడకేతెంచిన పలువురు కాంగ్రెస్ ప్రముఖులకు మనవిచేసిరి మద్రాసు శాసనసభ్యులు శ్రీయుతులు మేడూరి నాగేశ్వరరావు, మద్ది సుదర్శనం, గుంటూరు నరసింహారావు, వేముల కూర్మయ్య, నూకల వీరరాఘవయ్య, కొల్లిపర సూరయ్యగార్లును, శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారును, జనాబ్ షేక్ గాలిబ్ సాహెబ్ గారును, ఈ రు. 3 అదనపు వేతనమును ఈ ప్రాంతములందలి చాలామందిమేనేజర్లు ఇవ్వ శక్తిలేనివారనియు ఈ రు 3 ప్రభుత్వమువారిచ్చునట్లు ఏర్పాటు చేయుంచవలెననియు, గౌ॥ విద్యాశాఖామంత్రిగారికి లిఖితపూర్వకముగా వ్రాసి పంపిరి శ్రీ మంతెన వెంకటరాజుగారు ఈ రు 3 ప్రభుత్వము ఇచ్చుటకు డబ్బు లేదని తెలియపరచుచు, ఈ రు 3 ఇవ్వలేని బీదమేనేజర్లను ఎగ్జంప్టుచేయమని గౌ॥ విద్యాశాఖామంత్రిగారికి లిఖితపూర్వకముగా వ్రాసి పంపిరి

అచ్చట సమావేశమైన ఉపాధ్యాయ ప్రతినిధులు గౌ॥ శ్రీ కళా వెంకటరావుగారినికూడా దర్శించగా డిశంబరు 2 వ తేదీన జరుగనున్న మంత్రుల సమావేశములో తానుకూడా గౌ॥ కల్లూరి చంద్రమౌళిగారితో కలసి గౌ॥ విద్యాశాఖామంత్రిగారితో ఈ రు. 3 ను గూర్చి సంప్రతించి ఉపాధ్యాయులకు వీలైనంత సహాయము చేయుదుమని తెలియపరచిరి

తదుపరి ఉపాధ్యాయ ప్రతినిధులు రాష్ట్రమునందలి M **L A** లను అందరను ఇదేవిధముగా కలుసుకొని ఆయా ప్రాంతములందలి యథార్థపరిస్థితులను, ఈ రు 3 లకు సంబంధించినంతవరకు, గౌ॥విద్యాశాఖామంత్రిగారికి లిఖితపూర్వకముగా తెలియపరచునట్లు కృషిచేయుటకు తీర్మానించిరి

ఇట్లు,
కొత్తపల్లి సీతారామయ్య.

## అనంతపురంజిల్లా వయోజనవిద్యా ఉపాధ్యాయసంఘము.

నెల్లూరుజిల్లా ఉదయగిరి ప్రభుత్వ వయోజనవిద్యాశిక్షణకేంద్రములో శిక్షణపొందిన అనంతపురం జిల్లా ఉపాధ్యాయులు 22—11—51 తేదీ వుదయము 9 గంటలకు పాఠశాలలో తమ ఉపాధ్యాయులతో సమావేశమై వయోజనవిద్యావ్యాప్తికొఱకు తమ జిల్లాతరపున ఒక సంఘమును స్థాపించుటకు తీర్మానించిరి.

ఈ జిల్లా సంఘ కార్యక్రమమును నడపుటకు ఈక్రింది సభ్యులతో ఒక సంఘమును ఎన్నుకొనిరి.

—♦ సంఘసభ్యులు ♦—

| | |
|---|---|
| (1) ధర్మవరము తాలూకా | శ్రీ కె యల్ నారాయణప్పగారు |
| (2) తాడిపత్రి తాలూకా | శ్రీ యం చంగల్ రాయుడుగారు |
| (3) కల్యాణదుర్గం తాలూకా | శ్రీ సి రుద్రప్పగారు |

(4) హిందూపురం తాలూకా : శ్రీ జె. క్రిష్ణమూర్తిగారు
(5) కదిరి తాలూకా . శ్రీ ఎ. ఓబుళరాజు గారు
శ్రీ జి వి లక్ష్మయ్యశెట్టిగారు
శ్రీ జి పక్కీరప్పగారు

ప్రాతినిధ్యములేని మిగతా తాలూకాలనుంచి ఒక్కొక్కసభ్యుని తిరిగి ఎన్నుకొనుటకు తీర్మానించడమైనది ఈ సంఘమునకు శ్రీ కె యల్ నారాయణప్పగారిని ఏకగ్రీవముగా అధ్యక్షునిగా ఎన్నుకొనడమైనది

కార్యదర్శిగా శ్రీ ఎ ఓబుళరాజుగారినెన్నుకొనిరి. కోశాధికారిగా శ్రీ జి. పక్కీరప్పగారిని ఎన్నుకొనిరి ఈ సంఘ నిబంధనలు మొదలగు అనుబంధ కార్యక్రమమును నిర్ణయించుటకొరకు కొద్దికాలములో తిరిగి యొకచోట సమావేశమగుటకు సభ్యులచే తీర్మానించడమైనది.

కె. యల్. నారాయణప్ప
ప్రెసిడెంటు,
అడహాకు టీచర్సు కమిటీ - అనంతపురము.

18—10—51 తేదీని నర్సన్నపేటరేంజీ ప్రాథమికోపాధ్యాయసంఘమువారు సదరు రేం సీనియరు డిప్యూటీ ఇనస్పెక్టరుగారగు శ్రీ గేదెల సుందరనారాయణనాయుడు B A L T గారు M E.S. కాడరులో ప్రమోషను యివ్వబడి చిత్తూరుజిల్లాకు బదిలీకాబడిన సందర్భములో వారికి వీడ్కోలు సన్మానము గావించిరి రేంజీయందలి వివిధ సెంటర్లనుండి సుమారు రెండువందలమంది ఉపాధ్యాయులు, నర్సన్నపేటయందలి ఉద్యోగులు, పురప్రముఖులు, సభల నలంకరించిరి శ్రీ చొప్పల్లి జగన్నాథస్వామి పంతులు B A L T గారు నర్సన్నపేట హైస్కూలు హెడ్మాష్టరు సభాధ్యక్షతను వహించిరి ఛాయాచిత్రము తీయుట, తేనీటి విందు, ప్రముఖులచే సన్మానోపన్యాసములు, నాటి కార్యక్రమములోని ప్రధాన విషయములు రేంజీ సంఘాధ్యక్షులగు శ్రీ డి ఎ జగన్నాథరావుగారు, జూనియరు ఇనస్పెక్టరుగారగు శ్రీ ఆర్ నారాయణచెట్టిగారు, శ్రీ కరిమి నారాయణప్పలనాయుడుగారు అతిథియొక్క గుణగణముల గూర్చి ముచ్చటించిరి

జా లు మూ రు,
శ్రీకాకుళం జిల్లా
4—11—51

ఇట్లు
సదాశివుని చంద్రశేఖరరావు,
కార్యదర్శి.

## విజయవాడ :

కృష్ణాజిల్లాబోర్డు ప్రాథమికోపాధ్యాయసంఘ కార్యనిర్వాహకసభ 25—11—1951 తేదీన విజయవాడ రామమోహన లైబ్రరీలో సమావేశమై చర్చించి తీర్మానించిన యంశములు

1 జిల్లాలోగల తాలూకాబోర్డు యూనియనుల పునరుద్ధరించి ప్రతి సభ్యునివద్ద 8 అణాలు చందా వసూలుచేసి, నాల్గుఅణాలచొప్పున జిల్లా అసోసియేషనుకు పంపుటకును,

2. తాలూకాకు ఒకరుచొప్పున స్టాండింగుకమిటీ మెంబర్లను ఎన్నుకొనుటకును,

3 కృష్ణాజిల్లాలో పనిచేయు బోర్డు ఉపాధ్యాయులకు 20సంవత్సరముల సర్వీసు పూర్తియైనచో ప్రతివారికి అయా గ్రేడులప్రకారము గరిష్ఠవేతనము యిప్పించుటకును ఏకగ్రీవముగా తీర్మానించడమైనది

టి. యిశ్రాయేలు- సెక్రటరి.
26—11—51.

## తోంద్రంగి :

వయోజన పాఠశాలాధ్వర్యమున 7—11—51 తేదీని శ్రీ చిల్లరిగ గోపాలకృష్ణరావుగారి (J D.I చీపురుపల్లిరేంజి) అధ్యక్షతను వయోజనమహాసభ జరుపబడినది. సభకు పెక్కుమంది వయోజనులు వచ్చిరి పాఠశాలోపాధ్యాయులు శ్రీ వె. పార్వతీశంగారు, శ్రీ చే రామకృష్ణగజపతిరావుగారుమాట్లాడిరి.

ANDHRA RASTRA PRARAMBHA VIDYA
Regd. M N. 3766 Vol 40 - No 9

వయోజనవిద్యార్థి శ్రీ చేబోలు సూర్యనారాయణ భాగవతములోని దశమస్కంధమును చక్కగా పఠించెను. సభ జయప్రదముగా ముగిసెను.

—వె పార్వతీశం-(మేనేజరు)

## వెదురుమూడి :

8—11—51 తేదీన వెదురుమూడి హిందూ ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలో ఆలమూరు రేంజీ యస్ డి ఐ గారయిన శ్రీ బి వి నరసింహారావు, B A B ED గారి అధ్యక్షతను నల్లూరు కేంద్రోపాధ్యాయసంఘ ద్వితీయ వార్షికోత్సవము అతి వైభవముగా జరిగెను సభకు పలువురు పురప్రముఖులు విచ్చేసిరి. ఉపన్యాసములు, వ్యాసములు, పోటీలు జరిగెను గెలిచినవారికి యోగ్యతాపత్రము లొసగబడినవి. అధ్యక్షులవారు ఉపాధ్యాయులకు అమూల్యములగు సలహాలనొసంగిరి సభ జయప్రదముగా ముగిసెను.

వెదురుమూడి 8—11—51

(సం.) డి. సుబ్బారావు - సెక్రటరి.
నల్లూరు కేంద్రోపాధ్యాయసంఘము.

1952 సం॥రం మార్చి E.S L.C. గవర్నమెంటుపరీక్షకు ఉపయుక్తమగు

## లెఖల నోట్సు (గుడ్‌లక్ ఎగ్జామినర్)

### ప్రశ్నలు - జవాబులు

ద్వితీయ ముద్రణము

గవర్నమెంటు పరీక్ష ప్రశ్నపత్రములు 1942 నుంచి 1951 వరకు

జవాబులు, నూతన ప్రశ్నపత్రములు

E. S. L. C. గవర్నమెంటు పరీక్ష విద్యార్థులకు పరీక్షముంగు చాల ఉపయోగకరముగ నుండునట్లు, నూతన విద్యాప్రణాళిక ననుసరించి తేలికగా బోధపడునట్లు అనుభవముగల సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయుడు

యస్. కె. వి. శేషావతారం గారిచే రచింపబడినది

వెల రు. 1-4-0

## E. S. L. C. హిస్టరి, జాగ్రఫీ, సివిక్సుల పరీక్షాగైడు.

గ్రంథకర్త శ్రీ సిద్దాబత్తుల సుబ్రహ్మణ్యము

ఈ గైడు 8 త. E.S L. C పరీక్షకు ఉపయుక్తముగ వ్రాయబడినది. ఇందు హిస్టరి, జాగ్రఫీ, సివిక్సు సబ్జెక్టులమీాద ప్రశ్నలు, అందుకు జవాబులు గలవు. E.S.L.C. గవర్నమెంటు పరీక్షాపత్రములు (1942 - 1951 వరకు) జవాబులు సహా యిందు చేర్చబడినవి.

[వెల రు 1-4-0

వలయువారు యీాదిగువ చిరునామాకు వెంటనే ఆర్డర్లు యిప్పించగలరు

పబ్లిషర్సు & బుక్‌సెల్లర్సు.

## రామా అండ్ కో., H O. ఏలూరు

బ్రాంచెస్ -గుంటూరు, రాజమండ్రి, భీమవరం, తెనాలి, విజయనగరం.

Edited by Sri M. Venkata Ratnam Garu, B A, & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru